Regd No. N. 45 / M 3813

వెల ఒక అణా

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక



★ ఇపీ ఫకీరును గూర్చి గాంధిమహాత్ముని సూచన ★

★ ఫ్రాన్సుపై మూడు రాజ్యాల ఒత్తిడి ★

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కను శా. శ. ౧౮౬౨ విక్రమసం॥ర మాఘ బ॥ ౬ (౧౬-౫-౧౩౫౦ ఫ.) సోమవారము సంచిక ౨౮

## సింగపూరుపై దూకుటకు జపానుసన్నాహాలు!

### ఆస్ట్రేలియావారిభయము

ఇటలీ పతనమైనతర్వాత తనమీదపడబోవు ఒత్తిడిని తప్పించుకొనుటకు జపానును ఎట్లయినను యుద్ధములోనికి లాగవలెనని హిట్లరు విశ్వప్రయత్నాలను చేయుచున్నాడు. బ్రిటనుపై హిట్లరు వసంతకాలంలో దాడిచేసినప్పుడు జపాను అదే సమయంలో డచ్ ఇండీస్, మలయాలపై దాడిచేసి బ్రిటిష్ నౌకాదళానికి పనికల్పించవలెనని హిట్లరు ఉద్దేశ్యమని తోచుచున్నది. జపానులో జర్మనీ, ఇటలీలకు కొద్దిమందిమాత్రమే అనుకూలురు. వారిలతరఫున మరెట్టిప్రమాదకరమైన చర్యలకును దిగకూడదను అభిప్రాయము జపానులలో వ్యాపించుచున్నది.

మూడురాజ్యాల సంధిమీద సంతకాలు జరిగినప్పటినుండి జపాను ప్రభుత్వము ఏదో ఒక ప్రత్యేక సంఘటనకుగాను సన్నాహాలు చేస్తున్నట్లు కనబడుచున్నది.

ఫ్రెంచ్ ఇండో-చైనా థాయిలాండుల నడుమ యుద్ధవిరామసంధి ఫిబ్రవరి ౧౧వ తేది ఉదయం నుండి రెండు వారాలదాకా పొడిగించబడినది. రెండు దేశాలమధ్య శాంతిసంభాషణలు జపాను ప్రధానసగరమగు టోకియోలో సాగుచున్నవి. జపాను మధ్యవర్తిత్వం అంటే ఇండో చీనాలో నౌకా విమానాశ్రయాలపై ఇంకా ఎక్కువ అధికారాన్ని సంపాదించవలెనని జపాను చూస్తున్నదని అనుకొనవచ్చును. బ్రిటిషువారికి మరికొన్ని విజయాలు లభించుటకుముందే జపాను యుద్ధం ప్రారంభించవచ్చును లేదా ఇంకా గెలిచియుండిగెలిచిన రాజ్యంతో మంచి సంబంధం చెడిపోకుండా చూడవచ్చును.

దూరప్రాచ్య రంగంలోగాని పసిఫిక్‌లోగాని ఎట్టిసంఘటన పొడచూపినప్పటికి ఎదుర్కొనుటకు బ్రిటను సంసిద్ధముగానున్నది, ఇటీవలిసంఘటనలవల్ల జపాను తనకు జర్మనీ, ఇటలీ రాజ్యాలనుండి సహాయంరాదని గ్రహించుకొనగలిగినది.

జపాను దక్షిణదిశా విస్తరణ కార్యక్రమంలో తక్షణమే ఒకయెత్తు తలపెట్టినట్లు చీనాపత్రికలు తెల్పుచున్నవి.

జపాను దక్షిణదిశాగమనంలో అభ్యంతరం ఉండకుండా రష్యాతో మున్ముందు ఒకసమాధానానికిరావలెనని జర్మనీ తొందరచేస్తున్నది బ్రిటనుతోగాని, అమెరికాతోగాని జపానుచిక్కులలోపడుటకంటె రష్యాకుకోరదగినది ఇంకొకటి ఉండదని జపానులోని మితవాదులు భావించుచున్నారు, కాని ఈపరిస్థితిలో వీరిమాటవినేవారుఎవరూ కనబడరు.

సింగపూరుపైనను డచ్చి ఈస్టిండీస్‌పైనను జపాను ఆకస్మిక దండయాత్ర జరుపుటకు సంసిద్ధపడవచ్చునని అమెరికాలో రాజకీయవేత్తలు భయపడుచున్నారు, దక్షిణపసిఫిక్‌లోకూడా జపానువారు ఎత్తులువేయుటకు ఏవోసన్నాహాలు చేస్తున్నారట. ఆస్ట్రేలియన్ యుద్ధసలహాసంఘ సమావేశానంతరం, ఆస్ట్రేలియాదేశపు తాత్కాలికప్రధాని ఫాడేన్, ఆస్ట్రేలియా కార్మికనాయకుడు కర్టిన్‌గారలిద్దరు "యుద్ధం అత్యంత ప్రమాదపరిస్థితికి దారితీసే నూతన పరిణామానికి వచ్చినది" అని చెప్పిరి.

పసిఫిక్‌సముద్రంలో ఏదైనా మరికొన్ని పరిణామాలు సంభవించేపక్షంలో చీనా ఏమిచేయవలెనను అంశంపైన చీనాలో చర్చలు జరుగుచున్నవి. దూరప్రాచ్య రాజ్యాలలోవున్న అమెరికా దేశీయులు ఖాళీచేసిపోవలెనని క్రొత్తఆజ్ఞ, గావించబడినది. గతమూడువారాలలోనూ జర్మనీ జపానను పసిఫిక్‌లో బ్రిటను అమెరికాలపైన కయ్యానికిదింపుటకు తీవ్రకృషి చేసినదని వార్తలువచ్చినవి. జర్మనీని బలపరచుటకు జపాను అంగీకరించినదనికూడ ధ్రువపడుచున్నది.

దక్షిణదిశవ యుద్ధచర్యలుజరుపుటకు జపానువారు హైనానుదీవిని పెద్దఆశ్రయంగా తయారుచేసుకుంటున్నారని వార్తవచ్చినది. ఐదు కొత్త ఓడరేవులు, ఒకవిమానవాహకదళము, 300 బాంబర్లు ప్రస్తుతం హైనానుదీవివద్ద సమాయత్తమైవున్నవి. షైరన్, క్యాంగ్‌టంగులనుంచి ప్రతిరోజూ శకటములువచ్చి సైనికులను దింపుచున్నవి. హైనాన్‌దీవినుంచి హాంకాంగ్, ఫిలిప్పయిన్సు ఇండోచీనా, సింగపూరులను బెదరించడానికి వీలున్నదట,

కాని లండనులోని మిత్రరాజ్యవర్గాలవారు సాధారణంగా అన్నివిషయాలు తెలిసినవారు) ప్రమాదపరిస్థితి వెంటనే సంభవించకపోవచ్చునని అభిప్రాయపడుచున్నారు. ఇండోచీనా, థాయిలెండులమధ్య రాయబారాలుజరుగుచున్నందువల్లను, యుద్ధవిరామం మరొకపక్షము రోజులు పొడిగించబడినందువల్లను జపాను ఇంతత్వరలో యుద్ధచర్యను ప్రారంభించునని అనుకొనవీలులేదనుచున్నారు. రష్యాతోకూడ జపాను రాయబారాలు జరుపుచున్నదని వార్తలు వచ్చుచున్నవి. కాని జపానురష్యాలో ఇంకా ఎట్టిఒడంబడికకు రాలేదు. ఈవిధమైన ఒడంబడిక వుంటేనేగాని, తాను దక్షిణదిశకుదిగితే, ఉత్తరదిశ భద్రంగావుండగలదనునమ్మకం జపానుకుకలగదు.

అమెరికానుండి నూనెగాని, పెట్రోలుగాని నిర్ణయాలకు మించినట్టి లోహపుడబ్బాలను ఎగుమతిచేయదలచినవారందరును ఫిబ్రవరి ౧౫వ తేదితర్వాత ఎగుమతి ఉత్తరువులను పొందవలసివుండునని, రూజువెల్టు ఒక ఉత్తరువు చేసినాడు. జపానుకు తగినన్ని ట్యాంకర్లు లేకపోయినందువల్ల పెద్దపెద్దడబ్బాలలోనే నూనెను దిగుమతిచేసుకొంటున్నది- అందువల్లనూ వెల్టుఆజ్ఞ జపానుకుదెబ్బ.

ఫిబ్రవరి ౧౨వ తేదిన బ్రిటిష్ పార్లమెంటుకామన్సుసభలో, బ్రిటిషుఅమెరికాకంపెనీలు జపానుకునూనె సరఫరాచేస్తున్నవాఅనియు, డచ్చిఈస్టుఇండీసు జపానుకు నూనెసరఫరాచేయకుండా చర్యతీసుకొన్నారాఅనియు, బ్రిటిష్అధినివేశాలు జపానుకు ముడిపదార్థాలను సరఫరాచేస్తున్నవా అనియు ప్రశ్నలుఅడుగబడినవి

అధినివేశ శాఖామంత్రి వైకౌంటు క్రాన్‌బరన్ గారు సమాధానమిచ్చుచు డచ్చిఈస్టుఇండీసుకంపెనీలు జపానుకుకొంతనూనె సరఫరాచేయుటకు ఇటీవలఒప్పుకున్నవనిరి. ఈఒప్పందము ఆరునెలలగడువుకు బద్ధమైయుండునట. ఆంగ్లోఇరానియన్ నూనె కంపెనీవారుకూడా కొంతనూనెను జపానుకుసరఫరాచేస్తున్నారట, నిక్కెలు, రాగిమొదలయినపదార్థాలవిషయంలో అధినివేశప్రభుత్వాలు బ్రిటిషుసామ్రాజ్యభాగాలను దాటిపైకి ఏమాత్రంపంపనియటలేదు. ఈవిషయాలన్నిటిపైనను అమెరికాసంయుక్తరాజ్యము బ్రిటిషుసామ్రాజ్యమూ అధినివేశరాజ్యాలూ మంచిసహకారముగలిగియున్నవి. డచ్చిఈస్టుఇండీస్ చేస్తున్నసరఫరాలనుగురించి ఆలోచించవలసినది నెదర్లాండ్సుప్రభుత్వమే. ఆప్రభుత్వంకూడా పరిస్థితులను జాగ్రతగాఆలోచించేఒకవిధానాన్ని అనుసరిస్తుంది.

ముడిపదార్థాల సరఫరావిషయములో అధినివేశరాజ్యాలన్నీ బ్రిటిష్‌సామ్రాజ్యం అనుసరించేవిధానాన్నే అనుసరించగలవని క్రాన్‌బరను చెప్పెను.

## ఇపీఫకీరుపై వ్యతిరేకపు కేకలు

### గాంధీమహాత్ముని ఆమోదము

పరిహద్దురాష్ట్రంలో బన్ను డిప్యూటీకమిషనర్ ఖాన్‌బహద్దర్ మహమ్మదు దిలావరుఖాను గారితో ఈక్రిందివిధముగ విలేఖరునికి తెలిపినాడట. "నేను గాంధిమహాత్మునితో వ్యక్తిపరంగా ఉత్తరప్రత్యుత్తరములు జరిపితిని బన్నులో కాంగ్రెసువారు ఇతరకేకలు వేయుటకంటె ఇపీఫకీరుకు అతనిఅనుచరులైన దోపిడిగాండ్రకు ధనసహాయము చేయవద్దు"అను కేకలు వేయవలసిందిగ సలహాఇవ్వవలసినదని గాంధీజీకి సూచించినారు. గాంధీగారు నాసలహాను అంగీకరించినారు.

బన్నుజిల్లాలో ప్రస్తుత పరిస్థితులనుబట్టి కాంగ్రెసుప్రచారకులు తమపూర్తికాలమును గ్రామములలో ఇపీఫకీరు వ్యతిరేకప్రచారము చేయుచో అరాజకం తగ్గగలదని ఖాన్‌బహద్దరుగారి అభిప్రాయము.

—

మలయా ఉత్తరభాగానికి ఇంతేముందుబ్లెం హైంవిమానదళాన్ని బ్రిటిషువారుపంపినారు.

ఆస్ట్రేలియాకుచెందిన మరికొన్నివిమానదళాలుఇప్పుడుఅక్కడికి చేరినవి.

### ఫ్రాన్సుపై జర్మనీ, ఇటలీ, స్పెయినుల ఒత్తిడి

మార్షల్‌పెటెయినుగారిఅధ్యక్షతన ఫ్రెంచి ప్రభుత్వశాఖామంత్రిగాను ప్రభుత్వవ్యవహారాలన్నిటినీనడుపుకమిటీలో సభ్యుడుగానూ పనిచేయవలసినదని లావల్‌గారిని మార్షల్‌పెటెయిను ఆహ్వానించగా లావల్‌గారు తిరస్కరించినారు.

ఇంతలో విదేశాంగమంత్రియగు ఫ్లాండిన్‌గారు రాజీనామానిచ్చినారు. వారిస్థానంలో అడ్మిరల్ డార్లాను గారుచేర్చబడిరి.

లావల్‌ను తొలగించినతర్వాత ఉపప్రధానపదవి ఖాళీగానేవున్నది. అడ్మిరల్ డార్లన్ ఇకమీద విదేశాంగ శాఖామంత్రిగానూ, నౌకాశాఖామంత్రిగానూ పనిచేయుచుండును.

ఫ్లాండిన్ తనరాజీనామాలేఖలో మార్షల్‌పెటెయినుకు ఈవిధముగా తెలియజేసెను. "మీరునిర్ణయించిన బాధ్యతలను నిర్వహించుటకు నేనుకృషిచేసితిని. యుద్ధవిరామషరతులను అనుసరించి గౌరవముగా జర్మనీతో సహకారముచేయుటకు నేనుప్రయత్నించినాను. ఈవిధానము ఎంతవరకు నిర్వహించతగినదనువిషయం నాపైన ఆధారపడిలేదు. ప్రస్తుతపరిస్థితులశక్తివల్ల నేను ఈవిషయమును చెప్పవలసివచ్చినది. అందుచేత నారాజీనామాను అంగీకరింపవలసినదని కోరుచున్నాను. మనపితృభూమి దాస్యవిమోచనసందర్భములో మనభవిష్యత్తుధర్మము నిర్వహించుటకును. మీకార్యభారంలో సహాయపడుటకును మీతోఐకమత్యముగా పనిచేయుటకునుమాత్రమే నేనుఈచర్యనుఅవలంబించుచున్నానని ఫ్రెంచివారందరును భావింతురని నాఉద్దేశ్యము"

అందుకుమార్షల్ పెటెయిను ఫ్లాండిన్‌కు తనరాజీనామాద్వారా ఫ్రాన్సుకైసత్యాగమును చేసినవాడగుచున్నాడనియు ఫ్లాండిన్ నిష్పక్షపాతముగా వెలిబుచ్చిన అభిప్రాయమును అందరును అంగీకారపూర్వకముగా సమాదరించగలరనియు సమాధానమిచ్చెను. ఫ్లాండిను జర్మనిఒత్తిడిచే రాజీనామానిచ్చినాడని ఒకఊహయున్నది. అదెంతనిజమోగాని పెటెయినుతర్వాత ఫ్రాన్సుకుఅధిపతిగాను, పెటెయిను ఏకారణాలచేగాని తనవిధులను నిర్వహించలేనప్పుడు ప్రభుత్వాధిపతిగాను డార్లాను నియుక్తుడైనాడు.

ఇదిఇట్లుండ జర్మనీ, ఇటలీలు స్పెయినుతో కలిసి మార్షల్ పెటెయినుమీద ఒత్తిడితెచ్చి అతనిని తమవంకకు త్రిప్పుకొనవలెననియు, లావల్ షరతులకు ఒప్పుకొనేటట్లుచేయవలెననియు ప్రయత్నించుచున్నట్లు [illegible] వచ్చినది. జర్మనుసేనలకు స్పెయినువారి మొరాకోనుండి వెళ్ళనిచ్చుటకు అంగీకరించెదనని స్పెయిను ఫ్రాన్సును బెదరించుచున్నదట.

ట్యునీసియాకు సుమారు ౧౦౦ మైళ్లదూరంలోవున్న సిసిలీని ఇటాలీయులు హిట్లరుకుఇచ్చివేసిఉండుటవల్ల స్పెయినుకూడాపైవిధముగా చేయుట ప్రమాదకరమగును.

ఫ్రాన్సునుండి జర్మనీ ఫ్రెంచియుద్ధనౌకలను, ఉత్తరఆఫ్రికాలోను ఫ్రెంచిసేనలను, బిజెర్టావద్ద నుండు ఫ్రెంచినౌకాశ్రయమును కోరుచున్నట్లు తెలియుచున్నది

అమెరికావారిసహాయముతో నానాటికి హెచ్చుచున్న బ్రిటిషుబలమునందు ఫ్రెంచివారి విశ్వాసమును తగ్గించవలెనని హిట్లరుకు ఫ్రెంచిఆఫ్రికామీదను, ఫ్రెంచినౌకాదళముమీదను అధికారము ఉండవలెనని జర్మనీఇటలీలవారు తలచుచున్నారు.

స్పెయినునియంతయగు జనరల్‌ఫ్రాంకో, ముస్సోలినీగారలు ఇటలీలోని బోర్డిఘేరావద్ద ఫిబ్రవరి ౧౨వ తేదిన సంప్రతించిరి. యూరోపియను సమస్యలమీదను, నేటిచారిత్రాత్మకసమయంలో రెండుదేశాలకూసంబంధించిన విషయాలమీదను ఇటలీవారియొక్కయు వైఖరులు ఒకేవిధముగాఉన్నవని ఈసమావేశంలో నొక్కితెలుపబడినదనియు, సంప్రతింపుఉదయమంతయుజరిగి అపరాహ్ణమువరకుసాగినదనియుప్రకటించినారు

ఫ్రాంకో ఇటలీకి వెళ్లుటలోఉద్దేశ్యము నానాప్రకారముగ భావించబడుచున్నది.

ఫ్రాంకోమధ్యవర్తిత్వముచేయుటకు వెళ్ళుచున్నాడని కొందరుభావించుచున్నను స్పెయినుఎందుకు తటస్థముగా ఉన్నదో ముస్సోలినీకి నచ్చజెప్పుటకై వెళ్ళుచున్నాడని కొందరంటున్నారు

ఫ్రాంకో గారి ఇటలీప్రయాణమునుగురించి అమెరికాపత్రికలలోను, రేడియోలలోను ఒందొనికొకటిపొందని వ్యాఖ్యానాలు చేయబడుచున్నవి. మార్షల్ పెటెయినుజనరలు ఫ్రాంకోలమధ్యవర్తిత్వంవల్ల ఫిబ్రవరి ౧౨వ తేదివనే బ్రిటన్‌అమద్య యుద్ధవిరామముజరుగునని ఒకఊహ

యూరోపియనుసంఘర్షణను పరిష్కరించుటకుసూచింపబడిన ప్రతిపాదనలమీద ఫ్రాంకో ముస్సోలినీగారు చర్చింతురని మరికొందరిఊహ సమగ్రశాంతి సన్నాహాలు జరుగుచున్నవనియు, యూరపుఅంతటను యుద్ధంఆగిపోవునో, మెడిటరేనియనులోమాత్రం ఆగిపోవునో జరుగవచ్చుననియు కొందరితలంపు.

బ్రిటన్‌మీదయుద్ధంలో అదనపుసహాయం సంపాదించుటకే ఫ్రాంకోముస్సోలినీ కలుసుకుంటూవుండవచ్చునని రూటరువిలేఖరిఊహ

ఫిబ్రవరి ౧౪ వతేదివఇటలీనుండి జనరల్‌ఫ్రాంకో ఫ్రాన్సుకుబయలుదేరెను. ౧౩ వతేదిమధ్యాహ్నం మార్షల్ పెటెయినుమాంటు పెలియర్‌కు చేరెను.

ఫ్రాంకోమార్షలు పెటెయినుగారలుఫ్రాన్సు ఇటాలీలమద్య సరిహద్దునగ్గరవిందులోకలుసుకొనిరి. విందుతర్వాతజరిగిన సంభాషణలలో స్పెయినువిదేశాంగమంత్రి సనర్, అడ్మిరల్ డార్లను. ఫ్రెంచివిదేశీయాంగమంత్రి పేహూటన్, స్పెయినులో ఫ్రెంచిరాయబారి పిట్రిగారలుపాల్గొనిరి. మధ్యాహ్నం ౧-౫౫ గంటలకు పోలీసుప్రధానకార్యాలయములో మార్షల్ పెటెయిను జనరలు ఫ్రాంకోకుదర్శనమిచ్చెను విందుఅయినతర్వాత ఇద్దరునాయకులును మూడుగంటలసేపు సంభాషణగావించిరి. మధ్యాహ్నము సూనర్ అడ్మిరల్ డార్లాను గారలు సంభాషణచేసిరి.

ముస్సోలినీ జనరల్‌ఫ్రాంకోలజరిపినసంభాషణలలో అబిస్సీనియాలోనిపోరుటను కాలీచేయించడంవిషయమై చర్చించబడినట్లు ఒకపత్రికవిలేఖరి తెలుపుచున్నాడు. అడ్డిస్‌అబాబా-జిబూటిరైల్వేటెర్మినస్ ఫ్రెంచిసోమాలిలాండులో ఉన్నందున ఈవిషయమై ఫ్రాన్సుకుకూడా సంబంధంఉన్నకారణంవల్ల మార్షల్‌పెటెయినుతోజనరలుఫ్రాంకో మాట్లాడిఉండవచ్చునని ఊహ

ఇటలీకి జనరల్‌ఫ్రాంకో ఎట్టిసహాయం ఇవ్వవచ్చుననువిషయంలో ముస్సోలినీ ఫ్రాంకోనుకదిలించిఉండుననిఒకఊహ

—

# సంప్రతింపులు

ఎక్కడినో యెవరితోనో శ్రీ కాశీనాథరావు వైద్యాగారు మున్నగువారలు సంప్రతింపులు జరుపుతున్నారనీ, హిందూస్థాన ప్రాంతనిజాం వహించుట శ్రీవైద్యా మున్నగువారికి తగునా యనీ, హిందూప్రజామండలి సభాసేనుగన్న నాయకులు పృచ్ఛచేసినందులకు వారివారి ఉపన్యాసములలో యీ పాలను భూతద్దంతో చూపిన దృశ్యము యిస్తూ ఆంధ్రమహాసభాధ్యక్షులైన శ్రీ మందుముల రామచంద్రరావుగారు మరి రాష్ట్రంలోని దెబ్బతినిన ఆంధ్రులమీద గరళ మెక్కించి ప్రయోగించారు. సంప్రతింపులు జరుపటానికి వైద్యాగారు సర్వవిధాలా తగినవారనీ, ఆ ధ్రువకే కొన్ని రాష్ట్రీయులందరికీ తృప్తికలిగేటట్లు శ్రీవైద్యా ప్రభృతులు సంప్రతింపులు జరుపుతారనీ, సంప్రతింపులు ముగిసేవరకు ఆంధ్రమహాసభసభ్యులూ సభ్యేతరులూ ఆ నిషేధం పాటించక యావదాంధ్రులను నోరుమూయవలసిందనీ. నక్తిగ తాత్కాలిక యీ ప్రతాలూ వ్యక్తిపరుచకూడదనీ ప్రజాసంస్థకి అధ్యక్షులైన శ్రీ రామచంద్రరావుగారు శాసించినారు. తదానుసారం ఆంధ్రమహాసభ్యులు సభ్యేతరులు అనే భేదంలేక యావదాంధ్రులు యీశాసనాన్ని తూచా తప్పకుండా పాలించారంటే దానికి కారణం రాష్ట్రీయులహృదయాల్లో నిష్కల్మషంగా నాటుకొనియున్న హిందూముస్లింసఖ్యతే, రాష్ట్రీయ రాజకీయసమస్యా పరిష్కారమేనని అధ్యక్షుల వారుగుర్తించి మెచ్చుకోవాలి. ఇప్పుడు యీసంప్రతింపులు ప్రజయంతో అంతమొందాయని పలుసార్లు ప్రకటిస్తూండటంవల్ల ఆంధ్రమహాసభాధ్యక్షులు నియమించిన గడువుదాటిందని భావిస్తూ యీసాహసానికి కడంగినందుకు వారు మన్నిస్తారని నమ్మకం.

నాయకులు మేము ప్రజాప్రతినిధులమని చెప్పుకునేఅప్పుడు ప్రజలహృదయాల్లోం యేలాంటి అపోహలుకూడా కలుగకుండా ప్రతిసంశయాన్ని సమాధానపరుస్తూ విశ్వాసంసంపాదించాలి. ప్రజలు యెంతవిద్యావిహీనులైనా వారిని నేరుగానో కొందరు ప్రతినిధులద్వారానో తమ విశ్వాసంలోకి తీసుకోవటమే ప్రజాభిప్రాయ(democratic) పద్ధతికిగౌరవం. అట్లాకాక తమతో యేకాభిప్రాయులైన యేవత్సగురుమిత్రులలోతప్ప తక్కినవారికి తమయోగ్యతనుగ్రహించే విజ్ఞానంలేదని భావించటం ప్రజాసమూహాన్ని లెక్కకోయలేయటం—మళ్లీ ప్రజకే మేము ప్రతినిధులమని చెప్పుకోతిరగటం క్షమించతగనిసాహసం. ఎంతటినాయకులు యేకోఒకతెగ పక్షానవైనా బాజాబితాగా యెన్నుకోబడిన ప్రతినిధులవుతే కొంతవరకు ఆప్రక్క తెగ వారికైనా వారియందు విశ్వాసముండవచ్చునని ఊహించవచ్చు కాని నాయకులు ప్రస్తుతం యేకంపలో కూడా బాజాబితాగా యెన్నుకోబడిన ప్రతినిధులు కారు. కాకపోయినా స్వకపోల నాయకులైనప్పుడు ప్రజలు వారి ప్రాతినిధ్యాన్ని శంకిస్తే ప్రజలను దోషులనుట న్యాయంకాదు నాయకులకది గౌరవమూకాదు.

నాయకులు సమయించలేకపోతే అది ప్రజలనుకర్మ సంకోని ప్రజల్లో యీసంప్రతింపుల గురించి అనేకసంశయాలున్నాయి. ఒకదానికొకటి పొసగనిసంశయాలు. సుడకు శ్రీ మందుముల వారైనా సంప్రతింపులలోనిగోప్యాన్ని బైటపెట్టకపోయినా యేవిషయంలో, యెవరిమధ్యనం సంప్రతింపులు జరుగుతున్నాయో అమాత్రమైనా తెలిపితే కొంతవరకు తృప్తికలిగేది. అమాత్రంతో సంప్రతింపులసాఫల్యానికి విఘ్నంకలుగకపోయేది. మొట్టమొదట ఉద్భవించేది యీసంప్రతింపులు యెవరెవరిమధ్య అనే ప్రశ్న. ప్రజాప్రభుత్వంమధ్యనా? లేక హిందూమహమ్మదీయుల మధ్యనా? లేక చాలా వండిచెప్పేటట్లు యీ ముగ్గురిమధ్యనూనా?

ప్రజాప్రభుత్వంమధ్య నే సంప్రతింపులు జరుగుతున్నాయంటేకూడా యింకా ఉపప్రశ్నలు బైలుదేరుతాయి. ప్రభుత్వంవారు తాము అనుగ్రహించబోయే సంస్కరణలను యిదివరకేప్రకటించారు ఈసంప్రతింపులు ఒక వేళ జరుగుతుండగనే సంస్కరణలకి స్థానికకమిటీ కల్పించటానికై జన్నాతరువాత కిన్నాఅరెటి ముస్లింలీగర్ని ప్రభుత్వంవారు ఆహ్వానించి యిక్కడ ప్రశంసించారు. ఒక సంవత్సరంలోగా క్రొత్తరాజ్యాంగం అమల్లోకివస్తుందని ప్రకటించబడింది లోగా యీనాయకగణమే వేదికలద్వారా, పత్రికాముఖాన యీసంస్కరణలు మాకుమమ్మాటికీ పనికరావనీ, బాధ్యతాయుతప్రభుత్వమే మాపరమావధియని ఖండితంగాప్రకటించారు. మరియిప్పుడు ఈసంప్రతింపులమాట హిందూ, ముస్లిం ప్రభుత్వం ముగ్గురిమధ్య నాటక అయినట్టు, అయితేకూడా యింతగోప్యం అవసరంలేదు. హిందూప్రతినిధులను మహమ్మదీయ ప్రతినిధులను తమప్రతినిధులతోబాటు రౌండుటేబిల్ సమావేశంజరిపి అధికసంఖ్యాభిప్రాయానుసారమా లేక అందరికీ సమ్మతమైన మతప్రాతిపదికగానో సమస్యల పరిష్కరించవచ్చును మన దయామయులగు ప్రభుత్వము వారు యీవాదాశ కలిగినచో యింతగోప్యం అవసరంలేదు.

నాయకులు తమపీఠంమీదినుంచిదిగి, మాకు కొన్ని వరాలు అనుగ్రహిస్తే, అనగా ప్రజలను బాధ్యతవహించని కొన్నికోటరీలు మంత్రిపదవులలో మాతో పాటు కొర్దరికిస్తే, బాధ్యతాయుతప్రభుత్వం మాజన్మహక్కని ప్రజలను ఇన్నాళ్లనుండి మాటల్తో సమాధానపరచి సంస్కరణాలని ఆమోదించేటట్లు చేస్తామని రాయబారం నడుపుతున్నారని ఒక పుకారు. ఇందులోని ప్రథమమాట అబద్ధమనీ. బాధ్యతాయుతప్రభుత్వ సిద్ధికై నాక్షణిక వీలుకొక్క నిమిషంకోసంకూడా సహ్యవిశ్వాసం, నిష్కర్షగా యీప్రతిక్షణంబు ప్రభుత్వం చేస్తేవుంటుందని ప్రజలదృఢవిశ్వాసం. సప్తమాంధ్ర మహాసభా వేదికపైనుండి బాధ్యతలేనిప్రభుత్వం మేమేమా త్రముపొప్పుకోమని పెదార్థాలకి తావకాశం లేకుండా గర్జించినారు. అట్లాగే రాష్ట్రంలోనిమిగిలిన రెండు, మహారాష్ట్ర కర్ణాటక ప్రదేశాల ప్రజోద్యమాలైన మహాసభలుకూడా స్పష్టంగా యీమాటల్లోనే తీర్మానించాయి మరియిప్పుడుయింతటి యోగ్రీవమైన ప్రజాభిప్రాయాన్ని త్రోసిపుచ్చి "బాధ్యతాయుతప్రభుత్వం మాపరమావధి. కాని దానికోసం ప్రస్తుతం మేము పేచీపెట్టక మీరు చెప్పినట్టు వింటాం" మని ప్రభుత్వంతో యీ నాయకగణం మాటయిచ్చిందంటే అంతవిశ్వాసఘాతం ప్రజలనమ్ముతారా! పాపం శమించుగాక!!

ఇహ హిందూముస్లిం మధ్యసంప్రతింపులవిషయం బ్రిటిషుప్రభుత్వం బ్రిటిషుయిండియా ప్రజల్తో అన్నట్టు రాష్ట్రంలోని హిందూ ముస్లింలు సఖ్యపడితే కావలసింనయిస్తామని మనప్రభుత్వంకూడా యేమైనాఅన్నదా? అట్లాగేఅయిన అటు ప్రభుత్వంకానీ, యిటుమన నాయకులుకానీ అంత సిగ్గుపడటంయెందుకు? బ్రిటిషుప్రభుత్వం మాదిరి మనప్రభుత్వంగూడా ఘంటాపదంగాచెప్పవచ్చుగా అమాట! లేనా నాయకులైనా చెప్పవచ్చును బ్రిటిషిండియాలో తురకలు ప్రభుత్వంవాదని గర్వపడరు. అక్కడ హిందూముస్లింలురెండు తెగలు. ప్రభుత్వం నిష్కర్షగా మూడవ పార్టీ. హిందువులమాదిరి తురకలకుగూడా పరాయి ప్రభుత్వంవల్ల యిబ్బందులున్నాయి ఈ రెండు పార్టీల అవసరంకూడా భారతదేశ సంపూర్ణ స్వాతంత్ర్యము అయినా ప్రస్తుతం స్వాభాగ్యముకతో బ్రిటిషుప్రభుత్వం మహమ్మదీయులని కాస్తకటాక్షవీక్షణాల్తో చూస్తూండడంచేత వారితో సఖ్యతకోసం సంప్రతింపులుజరపడం వ్యర్థమని మహాత్మునంతటి శాంతిప్రియుడు తేల్చినాడు మరిమనదగ్గిర యీసంస్కరణలకల్ల కొందరు బానిసలనైనా మనతోబాటు సమానంగా కూర్చోబెట్టుకోవాల్సిస్తుందేమోనని అలిగి సంస్కరణల నిరసించిన మహమ్మదీయులు బానిసలైన హిందువులతో సఖ్యపడి ప్రభుత్వాన్ని యాచించాల్సిన గతియేమిటి? ప్రస్తుతప్రభుత్వంలోమార్పు వారికి అవసరమైతేగా ప్రభుత్వంలో మార్పు సూచించడానికి వారు హిందువుల్తో సఖ్యపడటం!

మరొకవిషయం. సంప్రతింపులు నిజంగా హిందూముస్లింలను ధ్యే అయితే వైద్యావంటి నాయకులు కేవలం హిందువులప్రాతినిధ్యం వహించ తగునా, అధిక సంఖ్యాకుల అమోఘాన్నైనా వీరు వదిసారా అనే సహజమైన ప్రశ్న బైలుదేరుతుంది. ఎందుకంటే పలుమారు వీరు బహిరంగంగా మేము నూటికినూరుపాళ్లు ప్రత్యేకజాతియుతమెరుగని జాతీయవాదులమని నొక్కివక్కాణించారు కేవలం వర్గీయములైన(communal)సంస్థలపుట్టుకొస్తున్నాయి. రాబోవురాజ్యాంగంలో వర్గీయ ఆధారంమీద యెన్నికలనిర్ణయించి ప్రభుత్వం మతపాక్షికులకీ, మతపాక్షిక సంస్థలకీ శాసనసమ్మతమైన స్థానంకల్పించింది దీనికికాంగ్రెసు సంస్థని శాసనవిరుద్ధమని నిరోధించి, ఇత్తెహాదుల్ ముస్లిమీన్ హిందూప్రజామండలివంటి సంస్థలని ప్రోత్సాహపరచటమేతార్కాణం నిష్కల్మషమైన జాతీయవాదులకీ, జాతీయసంస్థలకీ యిది అగ్నిపరీక్ష. నేను హిందూపాక్షికుడననో, లేక మహమ్మదీయ పాక్షికుడననో చెప్పుకుంటే తప్ప జాతీయవాదినని చెప్పితే రాబోవు ప్రభుత్వంలో స్థానంలేదు నిష్కల్మషమైన జాతీయసంస్థలూ, జాతీయవాదులు గౌరవాధికార అభిలాషలకు తిలోదకాలొసగి సంపూర్ణత్యాగ సంసిద్ధులై ముందుకోసం కట్టిపడనాడులు ఆలోచించితేతప్ప లాభంలేదు మనజాతీయవాదుల జాతీయతకు లోను యెంతోకూడా సంస్కరణలు అమల్లోకి రావటంతోటే తేలిపోతుంది

ఈ సంప్రతింపులసందర్భంలో ప్రత్యక్షంగా ప్రతినిమిషం యావత్ప్రపంచంలోని సంఘటనలు వేయిపెట్టినట్లుగా పురుతున్న వాస్తవ్యాని గమనించకుండటం సవ్యంకాదు, ఎంతటిసహజమైన హక్కులైనా కేవలం అడిగినంతమాత్రాన లభిస్తాయనుకోటంకల్ల. అట్లాలభించేటట్లైఅయితే ప్రస్తుతం జరుగుతోన్న యుద్ధాలు సంభవించక నేపోయేవి. ఉబుసుపోకటానికై యెన్ని శ్రీరంగనీతులు మాట్లాడుకున్నా కత్తియెవడిదో బత్తెవాడిదనే న్యాయంమీదనే ప్రపంచంనడుస్తున్నదసలు. లాంగతీసేవాడుంటే ప్రపంచ లొంగిపోతుందని అనాదే ఆపస్తంబ్య శకునం చెప్పారు పత్రికలో హేతువాదంతో వ్యాసాలవ్రాసికాని లేక చాకచక్యంతో సహేతుకంగా వాదించికాని హక్కులు సంపాదిస్తామనినమ్మట యెండమావుల మాని భ్రమయనటంతప్ప వేరుకాదు. వృథాకాలయాపనం మనప్రభుత్వం యిత్తెహాదుల్ ముస్లిమీన్ నాయకుల్ని గౌరవిస్తుందీ వారిమాట వింటుందీ అంటే ఆమాటవెనకాల అమోఘమైనశక్తివుంది కనుకనే ఆమాటనికొస్తే అలక్ష్యంచేస్తే కలిగే పర్యవసానం ప్రభుత్వానికి తెలుసు- కనుక మన నాయకులుమాట ముచ్చటలు మొదలుపెట్టటానికి ముందుతమమాటకు శక్తిసంపాదించాలి- వీరిమాట వినివించుకోకపోతే ప్రళయమాసన్నమవుతుందని ప్రభుత్వం జడుసుకొనగలిగినవాడే సంప్రతింపులు జరుపటంలో అర్థంవుంటుంది- జయంకలుగుతుంది-

ఇప్పటివరకు యీ సంప్రతింపుల పరిణామం దురదృష్టంవల్లనో అదృష్టంవల్లనో గుండుసున్నగా తేలింది- కాని మళ్లీ చలికాలమవాటికి యీ సంప్రతింపులు మళ్లీ ఆరంభంకావని యెవరుచెప్పగలరు- అందుకని గడచిన అనుభవాన్నిబట్టి ప్రజలూ నాయకులూ తమ తమ స్థానాలని స్పష్టపరుచుకుంటే నిజమైన నాయకులచేతులు బలపడ్తాయి- ప్రజల అపోహలు దూరమవుతాయి- నిష్కారణంగా ప్రజల వాక్స్వాతంత్ర్యాన్ని అరికట్టాల్సిన అవసరంవుండదు-

ఈ సంప్రతింపులు గావించిన నాయకులు త్వరలో విపులమైన పత్రికాప్రకటన గావింపనున్నారని తెలుస్తున్నది- అందుకనే యుద్ధకాలంలో గూడాయింత దీర్ఘంగా వ్రాయసాహసించింది- నాయకులు పై చూపబడిన సంశయాలన్నిటికీ తగు సమాధానంచెప్పిరేని ప్రజల ప్రతినిధులమని తాము సంప్రతింపులుచేసారో ఆప్రజలయెడ తమ విధిని నిర్వర్తింతురుగాక! ముందుకి యెన్నడైనా నిజంగా సంప్రతింపులకి తగినవాతావరణం లభించినప్పుడు తమ సంపూర్ణవిశ్వాసాన్ని జంకులేకుండా యేనాయకుల్లో తాముంచగలరో ఆ నాయకులు యేహద్దువరకు సంప్రతింపులుజరపవచ్చునో ఆలోచించుకొని నిర్ణయం చేసుకుంటే ప్రజలుకూడా తమ విధిని నిర్వర్తించినవారవుతారు.

నంబగిరి వెంకటరావు.

---

## నల్లగొండ

ఆంధ్రమహాసభాధ్యక్షులవారి ఆగమనము.

(ప్ర. విలేఖరి.)

౭-ఫిబ్రవరి ౧౯౪౧ ఫ. నాడు హైద్రాబాదు నుండి మందుముల రామచంద్రరావుగారు, ఆంధ్ర మహాసభాధ్యక్షులు, పి. శ్రీనివాసరెడ్డిగారు కోశాధ్యక్షులు నకలనీ నల్లగొండకు (౧౨)గంటలకు ఏతెంచిరి. పులిజాల వెంకటరంగారావుగారి భవనమందు విడిదిచేసిరి హుజూరునగరం, సూర్యాపేట, నల్లగొండతాలూకాలనుండి, జిల్లాసంఘసభ్యులు, ఆహ్వానింపబడిన యితరప్రముఖులు విచ్చేసిరి. వారందరితో నూతన ఆంధ్రమహాసభ నల్లగొండ జిల్లాలో చేయవలసిన అవసరముకలిగిన పరిస్థితులను అధ్యక్షులవారు తెలిపిరి. జిల్లానాయకులు, తాలూకాప్రముఖులు, అధ్యక్షులవారి సూచనలకు సమ్మతించిరి కాని తీరు మాసములోపున వ్యవధి లేనందున ఇంత గొప్పబాధ్యతను పూర్తిచేయజాలమేమో అనిసంశయము తెలిపిరి. కాని అధ్యక్షులవారు తీరు నెలలోపుననే జరుపవలెనని ఉంటుందనియు ౧౧ సంవత్సరములనుండి జరుగుచున్న ఉద్యమమునకు వ్యతిరేక అవసర పరిస్థితులు ఉద్భవించినపుడు వ్యవధిచాలదని సంశయపడుటచే, మన మింతకాలమునుండి పొందినశిక్షణ నిర్మాణలోపమున్నట్లుగ ఎంచవలసివుంటుందనియు, ప్రథమ శ్రేణి నాయకులైనవారు సాహసించిన ఈ పని అవలీలగ నెరవేర్చవలదని సమావేశమైన కార్యకర్తలతో తెలిపిరి. సాధక, బాధకములు మహాసభకు ఆరోగ్యకరమైన స్థలమున్నగువిషయములపై దీర్ఘాలోచనజరిగి తుదకు రాత్రి ౭ గంటలకు తాత్కాలిక ఆహ్వానసంఘ ఎన్నికలుజరిగి పులిజాల వెంకటరంగారావుగారు ఆహ్వానసంఘాధ్యక్షులుగను, ప్రధానకార్యదర్శి ముప్పారము నారాయణరెడ్డిగారు ఎన్నుకొనబడిరి. చిలుకూరుగ్రామం (హుజూరునగరంతాలూకా) అన్నివిధముల వసతియుండి బాగుంటుందని అభిప్రాయపడినారు. తాలూకాలప్రముఖులతో సంప్రతించి వారములోపున పైవిషయములనన్నిటిని తుదిపరిష్కారముచేసి స్థాయిసంఘమునకు "మహాసభఆహ్వానలేఖ" పంపవలెనని నిర్ణయింపబడెను కార్యక్రమము ముగిసినపిదప రాత్రి ౯ గంటలకు అధ్యక్షులవారు తమసహచర్యులతోసహా బయలుదేరి తిర్గి రాత్రి ౧౨ గంటలకు హైద్రాబాదుచేరుకొనిరి.

## నిజాంసాగరుక్రింద రైతులకష్టాలు

నిజాంసాగరుకాలువ వచ్చినప్పటినుండి మా జిల్లాలో చెరుకుపంటజాస్తిఅయి బెల్లంధరపడిపోయినందున నాలుగుఅయిదు సంవత్సరములక్రింద బహుఖ్యాతులగు శ్రీమహమ్మద్ తాలూక్దారుగారు రైతులకష్టనష్టములను గమనించి దయామయులగు శ్రీ శ్రీ నిజాం ప్రభుత్వమువారితో విన్నవించి రైతుల క్షేమమునకై బోధన్‌లో నిజాం షుగర్ ఫ్యాక్టరీని స్థాపించి రైల్వేలైన్‌కూడ వేయించిరి. వారిఈ మహోపకారము చిరస్మరణీయము. కాని గతరెండుసంవత్సరములనుండి లాభమునకు బదులు మా రైతులు నష్టమునకుగురియగుచున్నారు గతసంవత్సరము బెల్లముధర ౭ రూపాయలకు పుట్టిపున్నందున రైతులనుబలవంతపెట్టి బెదరించి తమచెరుకును నిజాంషుగర్ ఫ్యాక్టరీకే యిచ్చునట్లు ఫ్యాక్టరిఅధికారులు ఎగ్రిమెంటులు చేయించుకొనిరి. కొందరు ఎగ్రిమెంటు చేయనందున బలవంతముగ చెరుకు గానుగలను పీకించివేసి నానాఅల్లరులపాలుచేసిరివారితో ఎగ్రిమెంటు చేసిన వారికి చెరుకుఫర మ॥౧కి పదిఅణాలుమాత్రమియిచ్చిరి. అనగా పుట్టిబెల్లమునకు ముప్పదిరూపాయిలుమాత్రమె గిట్టినదన్నమాట రైతులుఈవిషయము షుగర్ ఫ్యాక్టరీ మొహతెమీము గారితో మనవిచేసుకొన బెల్లముధరపడిపోయినను యిదేధర ప్రకారము చెరుకుకొనెదమనిన్ని బెల్లముతీసేఅవసరము రైతుకెన్నటికిని వుండదనిన్ని శలవిచ్చిరి. ఈ సంవత్సరము ధరనిర్ణయము చేయకనే ఎగ్రిమెంటుచేయించుకొనిరి. తర్వాత మ॥౧కి యేడుఅణాలుమాత్రము నిర్ణయముచేసినారు. యెందరితో మొరపెట్టుకొనినను వినువారులేరైరి అమోనియం సల్ఫేట్ ధర బస్తా॥౧కి గతసంవత్సరము పదిహేనురూపాయలు పదిహేనుఅణాలు ఈసంవత్సరము పదిహేనురూపాయలు. ఈసంవత్సరము కాలువ నీరు కూడ వలయునంత లేనందువలన పంటకూడచాలనష్టపడినది. ఖర్చులుఎక్కువ చెరుకుధర తక్కువ అయినందునరైతులు కృంగుచున్నారు. యిట్టి పరిస్థితులలో మూలిగేనక్కపై తాటికాయపడ్డట్టు ఫ్యాక్టరిఅధికారులు చెరుకుకొనుటయులేదు. చెరుకు బుతుపు యింతమించు మాసముగడిచినది. బెల్లముధర పుట్టికి౧౬రూపాయలవరకు తగ్గినది. ఫ్యాక్టరిఅధికారులు కొన్నిగ్రామములకు పోయి చెరుకుతక్కరలేదు బెల్లంవండు

## పెంట్లవెల్లి

రథాలుసూర్యచే దునబెను.

(బ. వి.)

జటప్రోలు సంస్థానంలో చేరిన పెంట్లవెల్లి గ్రామంలో రథముఒకటి చేయించినారు. అది పెద్దదెంది. వీధులుచిన్నవైనవి. రథంకొరకు వీధులువెడల్పుచేసేదానికి సంస్థానంవారు ఆజ్ఞాపించినారని వినవచ్చినది. అట్లుచేయుటవలన ప్రజలకిబ్బందికలుగును.

కొల్లాపురంలోఒకచిన్నరథమున్నది. దాన్ని మా పెంట్లవెల్లికితెచ్చి పెంట్లవెల్లిరథాన్ని కొల్లాపురానికి తీసికొనిపోతే చిక్కులుండవనిసంస్థానంవారితో మనవి.

కొండని చెప్పుచున్నారు ఫ్యాక్టరివారితో చేసిన ఎగ్రిమెంటుప్రకారం చెరుకు యితరులకు అమ్ముకొనుటకు వీలులేనందునవలన యిప్పటికిచాలాభాగం చెరుకుతోటలు యెండిపోయినవి. కొన్నిపరకురాముప్రీతిఅయినవి. రైతులు తంత్రోపతంత్రము లు శ్రీం అబ్బుల్ తాలుక్దారుగారి వద్దకువెళ్లి మొరపెట్టుకొనుచున్నారు. శ్రీవారు యెన్నిప్రయత్నములో చేసిరికాని న్యాయముజరుగలేదు. యిందుకు కారణము ఫ్యాక్టరీవారి అమానిచెరుకుతోటలె. యింతేకాక షుగర్ ఫ్యాక్టరిమొహతెమీముసాహెబు గారు తమకుయిష్టులై, స్నేహితులుగనుండువారు ఎగ్రిమెంటుచేయకున్నప్పటికి చిట్టీలుదయచేసి యింతచెరుకున్నను త్వరలో కొనుచున్నారు. బీదతనముచేత దిక్కులేని రైతులకు ఆశ్రయములేదు. ఒకవేళ్ల ఎవరైనా సాహసించి అడుగబోయినచో చీవాట్లుతప్ప మరేమియులభించదు. ఫ్యాక్టరి వ్యవహారమంతయు మొహతెమీము గారి దయలో చిక్కువున్నది. రూల్సుగీల్సు ఏమియు లేవు. వారికితోచినదే న్యాయము వారుపెట్టినదేభిక్ష. ఈవిషయమున ప్రభుత్వమువారు త్వరలో శ్రద్ధగైకొని రైతులనుతోవ్వడి ప్రస్తుతము న్నధరకు అధికముగ ఒక్కఅణాబోనసు యిప్పించుము రైతులవద్దనున్న చెరుకంతయు షుగర్ ఫ్యాక్టరివారు కొనునట్లు యేర్పాటుచేయగలరని ప్రార్థించుచున్నాము. ఈవిషయమున నిజాం రాష్ట్రాంధ్ర మహాసభవారుకూడ మాజిల్లా ప్రజలపక్షమున ప్రభుత్వమువారికి మాకష్టములనివేదించి సహాయమిప్పింతురని కోరుచున్నాము.

ఇట్లు
సీ. మాణిక్యరెడ్డి
నిజామాబాదు.

## గద్వాల

ప్లేగు

(స్వ.వి.) ఫర్వరి ౧౦

గద్వాల చుట్టుపట్ల గ్రామములలో ప్లేగు తీక్ష్ణముగానున్నది. గద్వాలలోకూడ ఎలుకలు పడుచున్నవి. అయినప్పటికిని గద్వాలజాత్ర జరుపుటకై శ్రీ శ్రీ శ్రీ మహారాణిగారు గద్వాలకు త్రయోదశి సోమవారము వచ్చియున్నారు జాతరకు జనులు రాకూడదనికూడ సంస్థానమువారు ప్రకటించియున్నారు.

ఆట పోటీపందెములు

ఈసంవత్సరము ప్లేగువలన గద్వాలజాత్ర స్థానికజాత్రమాత్రమే అయినది. అందుచే పోటీపందెములు, అనగా టోర్నమెంటులుజరుగవు. కనుక ఫుట్‌బాల్, బ్యాడ్‌మెంటన్, హాకీ అన్నీ ఆటలునిలచిపోయినవి. అందువలన జాతరకూడా చప్పనైపోయినది.

## కమ్మవిద్యార్థి సహాయ సంఘము

(ఖమ్మంమెట్టు)

ఖమ్మంలోజరుగబోవు కమ్మహాస్టల్ ప్రారంభోత్సవము, కమ్మమహాజనసభలకుగాను సుమారు రెండులు కావలసియున్నది. ఇంతవరకు సుమారు నాలుగువందరు విరాళములు వచ్చినవి హాస్టల్ ప్రారంభోత్సవము జరుగురోజులు సమీపించుచున్నవి. కాబట్టి కమ్మమహాశయులు తగినంత సహాయపడి విరాళములు బహుతొందరగాపంపించుటకుకోరుచున్నాను. వేములపల్లి రంగయ్యగారు గ్రామాలలో సంచరముచేసి విరాళములు ప్రోగుచేసి మాకుపంపించినందుకు వారికి కృతజ్ఞత తెలుపుచున్నాము. వీరివలెనేతక్కినవారు గ్రామాలలో విరాళములుసమకూర్చి సహాయపడుటకు ప్రార్థించుచున్నాను. కొదువ వివరములు ముందు ప్రకటించగలము.

ఖమ్మంమెట్టు ౯-౨-౧౯౪౧ } చావా వెంకటకోటయ్య, కార్యదర్శి.

## పట్టపగలు దొంగల దోపిడి

ఇల్లందు తాలూకా కేంద్రమగు యిల్లందుకు ౨ మైళ్ళదూరంలో మాణిక్యారం అనుగ్రామంకలదు ఇచ్చట చ. ౨-౨-౧౯౪౧ సాయంత్రి ౫౦. లకు సమయమున, ౭ మందిదొంగలు జమ్యాలు పిస్తోళ్ళయుక్తంవచ్చి దుబ్బాకు వీరయ్య చౌదరీ యింట్లో (౧౦౦౦) వెయ్యిరూపాయీలు ఖరీదుగల బంగారంవస్తువులు దొంగిలించిరి. ఒకస్త్రీని అపాయకరమయిన దెబ్బలుకొట్టిరి సదరువీరయ్యను పిస్తోలుతోకాల్చగా అరచేతికితీవ్రమయిన గాయముతగిలినది. పోలీసువారు నిందితులకొరకై పరిశోధించుచున్నారు.

ఇట్లు,
మోతూరు నారాయణ

### మలేరియాచే గ్రామము పూర్తిగా నాశనమైనది

డాక్టర్లు ఎడతెగని సాహసముచేసినారు. ఆహారపుసమస్య పరిష్కరింపబడినది మనదేశపుమరణసంఖ్యలో నూటికి 16వ వంతు కన్నాగా మలేరియాతో మరణించుచున్నారని తెల్పబడినది. కొన్నిప్రదేశములలో గ్రామములు పూర్తిగా నాశనమైనట్లు తెలియవచ్చుచున్నది.

ఆరోగ్యశాఖవారు, డాక్టర్లు ఎక్కువ శ్రమవహించినారు. ఆహారవిషయమున వారికష్టములు ఫలింపకపోయెను. సకలావయవములు నిర్బలముగానుండుటచే ఏఆహారము జీర్ణింపకపోవడమే వేలకొలదిజనులు మరణించుటకుకారణము.

రోగికిసహించునట్లు, సులభముగా జీర్ణమై సకలావయవములకు శక్తినిచ్చు ఆహారముగలదు. ఇదియే హార్లిక్స్ మిల్కి శ్రేష్ఠమైనది, అన్ని ఆస్పత్రులలోను, అన్నివిధముల జ్వరములకు ఇచ్చుచున్నారు. ఇది జీర్ణావయవములకు ఏవిధమైన హాని కలుగజేయక అన్ని భాగములకు శక్తిని గలుగచేసి తేరుదకాలమును తగ్గించి రోగిని యథాస్థితికి త్వరలో తెచ్చును.

## పోలీసు అత్యాచారం

రాంపురంకెళ్ళేకొరకు నేను, భీమిరెడ్డి అను ఉస్మానియాకాలేజీ విద్యార్థి, మరొక స్థానిక విద్యార్థి కోయిలకొండ బస్సుకై నిరీక్షించుచుంటిమి. పోలీసుజవాను భీమిరెడ్డిని బెదరించి పేరు, ఊరు వ్రాసుకొనెను. తర్వాత నావద్దకి వచ్చి ఆ లేసేప్ తేమిఅనెను. ఆలేఅని యెందుకంటావుఅనిఅంటిని. అందుపై పదితిట్లు కుప్పించెను. చేయిపట్టి బస్సులో కూర్చున్నవాన్ని బయటికిలాగి దగ్గరనే ఉన్న జమేదారువద్దకు గుంజుకొనిపోయెను. అతడున్నూ నాలుగుతిట్టెను ఆటుతర్వాత పేరుఊరు వ్రాసుకొని బెదరించి పంపివేసిరి. ఈ తిట్లువివరాలుచాలాఉన్నవి. పదిమందిలో చాలాఅవమానం జరిగెను. పోలీసుశాఖవారు యీవిషయాన్ని బాగుగావిచారించి యీవి అమాయక ప్రయాణీకులకు అవమానం భయము ఇబ్బందికలుగకుండా ఏర్పాటుచేయ ప్రార్థన. ఇట్లు

యస్. సాంబమూర్తి సిద్ధాంతరత్న,
మహిబూబునగరము.

## మీకు సంతతి ఎందుకుండదు?

సాధారణముగా గర్భకోశమునచెడుటవల్ల గర్భమురానేరదు. వివాహమై చాలకాలమైనను బిడ్డలులేనందున నిస్పృహఏర్పడును. దీనికొరకు మేముఒక ఔషధమునుతయారుచేసి మంచిఅనుభవముసంపాదించినాము. దీనిని ఉపయోగించినవారియొడిలో యిప్పుడు పిల్లలుఆడుచున్నారు. ఈమందుపేరు 'లోహార్ జౌలాద్' యిది యూనానీపద్ధతిపై తయారుచేయబడినది.

లక్ష్మీబాయినర్సు దెల్వి.

లోపులబట్టి, హైదరాబాదు-దక్కన్-
సమయం-ఉద- 8 నుండి 12 సాయం- 3నుండి 5

## మా చందాదారులకు సూచన

దయచేసి తాము ఉత్తరములు వ్రాయునప్పుడు తమ చందానెంబరు తెలుపగలరు.



## హె. ఘ. వ. నిజాంస్టేట్ రైల్వే

## నోటీసు

ప్రయాణీకులచార్జీలు యికముందు ఏవిధమైనమార్పులేకుండా హాలీనాణెములో ఏర్పాటుచేసి, ఏఏస్టేషనులలోనైతే యీరేట్లు అమలునకువచ్చినవో ఆయాస్టేషనులలోనెల్ల ధరలపట్టికలు ప్రకటింపబడినవి. ఈరేట్లు మ. ఘ. వ నిజాం రాష్ట్రమందున్న నిజాం స్టేటు రైల్వేయందు ప్రయాణముచేయువారికి మాత్రమేవర్తించును. ఇదివరకుమారుచుండు హాలీ కల్దారు రేట్లవల్ల టికెట్లఖరీదు హాలీనాణెములో మారుచుండెను కాని అట్లిక్కయికనుండదు.

యీ క్రిందిస్టేషన్లలోమాత్రము టికెట్లపై బి. జి. రేట్లువేసియుండి యిదివరకువలెనే నడచుచుండును.

# డోర్నకల్లులో ప్రధానమంత్రిగారు

"రాష్ట్రములో ప్రతివానును విద్యనేర్పినవానుగా ఉండవలెను" —సర్ అక్బర్ హైదరీ.

## పాఠశాలప్రారంభోత్సవము

హి. ఎ. సర్ అక్బర్ హైదరీగారు పాల్వంచకుపోవుచు మార్గములో డోర్నకల్లులో శైలువించి ౧౧ ఫిబ్రవరీనాడుదిగిరి. పట్నమంతయు బాగా అలంకరింపబడెను. దారిలో ప్రధానమంత్రిగారికి పూలహారములుచాలా వేసిరి. క్రొత్తగా నారికి స్వాగతమిచ్చి అధికారులపరిచయము కలిగించిరి. వరంగల్ సూబేదారు, తాలూక్దారుగారలువచ్చియుండిరి.

డోర్నకల్లు ప్రైమరీ పాఠశాలాభవనముయొక్క ప్రవేశోత్సవమును ప్రధానమంత్రిగారు కావించుచు ఇట్లుఉపన్యసించిరి.

"మేముఏర్పాటుచేసిన ఐదేండ్లవిద్యాప్రణాళికననుసరించి ఇదే మొదటికొత్త ప్రైమరీపాఠశాల నాకుప్రాథమికవిద్యపై చాలా అభిమానంకలదు, అవిద్యను రూపుమాపుటలో ప్రాథమికవిద్యను బాగా వ్యాపింపజేయవలెను. దానికైమనమునిరంతరము ప్రయత్నంచేయవలెను. రాష్ట్రములో ప్రతివాడును, చిన్నపెద్దలును, వ్రాయచదువను నేర్చుకొనేటరకు మనము శ్రమించవలెను. అవిద్యఅను ఘోరకళంకాన్ని తుడిచివేయవలెను. కేవలము బళ్లసంఖ్య పెంచుటతో తృప్తిపడగూడదు అజ్ఞాననిర్మూలనానికి ఎన్ని సాధనములున్నవో వాటిన్నిటితో పనిచేసుకొనవలెను, పిల్లలేకాక పెద్దవారును విద్యాలాభముపొందునట్లు చేయవలెను. సినిమాలు, రేడియో, గ్రామఫోనులు, వీటిద్వారా విద్యవ్యాపింపజేయవలెను. ప్రాథమికపాఠశాలలోని ఉపాధ్యాయుల జీతాలెక్కువచేయవలెను. అట్లుచేసి ఉపాధ్యాయులు కేవలంబళ్ళలో నేచదువుచెప్పుటకాక బయటను వైపాధనాలద్వారా జనసామాన్యములో విద్యాజ్యోతిని వెలిగించి భావవైశాల్యముకలిగించవలెను. లోకల్ఫండును ప్రభుత్వమున్నుకలిసి యీపనిలోపనిచేయవలెను. విద్యావ్యయమును ప్రభుత్వంభరించవలెను. లోకల్ఫండువారు సూక్ష్మలభవనాలుకట్టించవలెను. బాలికలవిద్య చాలవెనుకబడినది. వారి విద్యావృద్ధికి ప్రత్యేకశ్రద్ధవహించవలెను. ఈ ౩౦ ఏండ్లలోఅయిన రాష్ట్రాభివృద్ధియంతయు మన దృష్టికల మూడున్నవ నిజాంప్రభువుగారి శ్రద్ధాదయాగుణములవల్ల నేకలిగినది. దైవము వారినీ వారికుటుంబాన్ని సుఖవంతముగా రక్షించుచుండును గాక"

ఆటుతర్వాత ప్రధానమంత్రిగారు డోర్నకల్ ఫాదిరీలగిర్జాకు వెళ్లిరి. అక్కడవారికి సన్మానపత్రమును సమర్పించిరి. దానికివిచరీతిగా శ్రీవారు ప్రత్యుత్తరమిచ్చుచునట్లనిరి.

"మా ప్రభువులుంగారును వారిపూర్వీకులును అన్నిమతాలను ఏకదృష్టితో చూచినారు. ఇచ్చటమీపరియత్నాలనుగురించి మేముసంతోషించినాముఅంతచేతఓషప్పగారికి సిల్వర్ జూబిలీ మెడల్ తో బహూకరించుచున్నాము.

ఆటుతర్వాత శ్రీనారు పాల్వంచకు వెళ్ళిరి. పాల్వంచలో శ్రీప్రధానమంత్రిగారికి శ్రీరాజాగారు సన్మానపత్రమును సమర్పించుకొనిరి. దానికిప్రత్యుత్తరమిచ్చుచు ప్రధానమంత్రిగారిట్లు శలవిచ్చిరి.

"నాకుసింగరేణిగనులతో సన్నిహితసంబంధమున్నందున చాలాకాలమునుండి యీప్రాంతాలకురావలెనని సంకల్పించియుంటిని. ఈగోదావరీతీరములో కోయదొరలు కొండరెడ్లు ప్రత్యేకముగా నివసించుచున్నారు.

సంస్థానముబాగా అభివృద్ధినొందుచున్నదని వినుటకుసంతోషించినాను. అశ్వారావుబహద్దరువంశమువారు సుమారు ౬౦౦ ఏడ్లనుండి ఈ ప్రాంతములను పాలించుచున్నారు. ఇదిచాలా ప్రాచీనకుటుంబము ఈకుటుంబము శ్రీమన్ఘనవన్ నిజాంప్రభువులవంశమువారి ఆదరమునకుపాత్రమైనది. మీరుభద్రాచలమును అప్పులనుండి విడిపించుటకొనుటకై చేసేప్రయత్నాలకు నాసాను భూతికలదు. ఆధునికపద్ధతులపై ఈసంస్థానములో పరిపాలనఏర్పడగలదని నాఆశయము ఇతరసంస్థానాలకు ఆదర్శంగాఉండవలెననికోరుతాను. ప్రతిసంస్థానీకుడును బాగుగా సమగ్రముగా తమప్రజలక్షేమాలను విచారించుకొనుట వారి విధియైయున్నది.

---

### సర్కారీభవన ప్రారంభోత్సవము

ప్రధానమంత్రిగారు పాల్వంచకు వెళ్ళి, అచ్చటవారికి పాల్వంచరాజాగారు విందుచేసి, సన్మానపత్రము సమర్పించుకొన్న తర్వాత పాల్వంచలో కట్టిన నూతన సర్కారీభవనాల ప్రారంభోత్సవమును హి.ఎ. సర్ అక్బర్ హైదరీగారు గావించినారు.

---











వామనభట్ల సాంబయ్య
శ్రీలక్ష్మీనరసింహ ఫోటోకంపెని
ఫొటోగ్రాఫర్-ఓవర్సీర్
ధర్మపురిపోస్టు నిజాంరైల్వే
మంచిరియాల స్టేషన్

## ౦మహాసభ స్థాయిసంఘ సమావేశము

(విలేఖరి)

బెజవాడ, ఫిబ్రవరి ౧౦

ఆంధ్రమహాసభా స్థాయిసంఘ సమావేశము బెజవాడదివ్యజ్ఞానసమాజములో నిన్న మధ్యాహ్నము ౨ గంటలకు జరిగినది. ఆంధ్రమహాసభాస్థాయిసంఘాధ్యక్షులు శ్రీ ఎం-అనంతశయనం అయ్యంగారు (అడ్వకేటు, భారతశాసనసభ్యులు, చిత్తూరు) ఉపాధ్యక్షులు శ్రీ కడపకోటిరెడ్డిగారు శార్ట్లా, మద్రాసుశాసనసభ్యులు. ప్రధాన కార్యదర్శి శ్రీ కె. వరదాచారిగారు అడ్వకేటు, మద్రాసు శాసనసభ్యులు, చిత్తూరు, సంఘాకార్యదర్శి శ్రీ రామచంద్రుని వెంకటప్పగారు (మద్రాసు) మహాసభావ్యవహారనిర్వహణము ఎవ్వరికి చెప్పకుండగనే ముందు కార్యక్రమమునుగురించి యోచింపకుండనే కారాగారమునకు వెళ్లుటచేత స్థాయిసంఘసభ్యులు ఎనమండుగురు సంతకములతో సమావేశమును జరుపవిజ్ఞప్తి అందరు సభ్యులకుపంపియుండిరి. శ్రీ రామన్న నింహంపంతులుగారికి స్థాయిసంఘసభ్యులు కానంమున ప్రత్యేకాహ్వానముబంపిరి.

సభకుదయచేసినవారు శ్రీయుతులు వడింపల్లి వెంకటలక్ష్మీ రావు,గుంటూరు తెల్లాకులజాలయ్య పురపాలకసంఘాధ్యక్షులు. గుమ్మడిదల వెంకటసుబ్బారావు, పంద్రంగి కేశవరావు, ఈడ్పుగంటి వెంకటరత్నమాంబ, అయ్యంకి వెంకటరమణయ్య లేకుమళ్ళ రామచంద్ర రావు, మల్లెల శ్రీ రామమూర్తి, గుండవరపుహనుమారెడ్డి, సుసర్ల శ్రీ రామన్న సింహంగార్లు. ఆంధ్రజాతీయ కవిశేఖరుడు శ్రీమంగిపూడి వెంకటశర్మగారు ఆహ్వానితులై విచ్చేసిరి.

నడింపల్లి నరసింహారావుగారధ్యక్షతవహించిరి.

### తీర్మానములు

౧ ఆంధ్రమహాసభకు అధ్యక్షతవహించిన శ్రీ ఆంధ్రభీష్మ న్యాపతి సుబ్బారావుపంతులు, శ్రీ వరహగిరి వెంకటజోగయ్యపంతులుగార్లమరణమునకు విచారముదెల్పుచు వారిఆత్మశాంతికలుగుగాకయని యీసభవారు తీర్మానించుచున్నారు

౨ స్థాయిసంఘసభ్యులు శ్రీ పుల్లెలశ్యామసుందరరావు, కొమ్మారెడ్డి సత్యనారాయణగార్ల అకాలమరణమునకు యీసభవారు విచారము

(౩) ఆంధ్రప్రముఖులగు శ్రీ గిడుగు రామమూర్తిపంతులు, శ్రీ పిల్లలమర్రి ఆంజనేయులుపంతులు, నడింపల్లి సుబ్బరాజా పానుగంటి లక్ష్మీనరసింహారావు శ్రీ మా వ( జోగయ్యశర్మ (ఏలూరు) గార్ల మరణమునకే సభవారు సంతాపము తెల్పుచున్నారు.

(౪) శ్రీ ఎం. అనంతశయన అయ్యంగారితరఫున శ్రీ చల్లపల్లి రాజాగారిని అధ్యక్షులుగా ఎన్నుకోవడమైనది.

(౫) శ్రీ కోటిరెడ్డిగారి స్థానేవారిభార్య శ్రీ రామసుబ్బమ్మ (కడప జిల్లాబోర్డు ప్రెసిడెంటు) గారిని ఉపాధ్యక్షురాలిగాను, (౬. ప్రధానకార్యదర్శి శ్రీ వరదాచారిగారిస్థానే బ్రహ్మశ్రీ గుమ్మిడదల వెంకటసుబ్బారావుగారిని,

(౭) స్థాయిసంఘసభ్యులు శ్రీయుతులు దండు నారాయణరాజా పసుమర్తి వీరభద్రస్వామి మల్లిపూడి పళ్ళంరాజుగార్లస్థానే కొప్పరపు సుబ్బయ్యశెట్టి, గుండవరపు హనుమారెడ్డి, అయ్యంకి వెంకట రమణయ్యగార్లను ఎన్నుకొనిరి

(౮) ఉపాధ్యక్షులు శ్రీ స్వామి వెంకటాచలంశెట్టి సహాయకార్యదర్శి శ్రీ తుంపూడి భగవంతంగుప్తగార్ల రాజీనామాలను ఉపసంహరించుకొనుమని తీర్మానింపబడినది.

శ్రీ సుసర్ల శ్రీ రామన్నసింహంగారిని స్థాయిసంఘసభ్యులుగా ఎన్నుకోవడమైనది. (శ్రీ రామన్నసింహంగారు గుంటూరుమహాసభకు వెళ్ళకపోవుటచేత కాబోలు వారిని స్థాయిసంఘములో అపుడు వేసియుండలేదు)

(౯) గుంటూరు ఆంధ్రమహాసభా తీర్మానప్రకారము ౨-౩ఆంధ్రసభను ౧౫-౪-౧౯౪౧ లోగా జరుపుటకు నిశ్చయించుచూ కొప్పరపు సుబ్బయ్యచెట్టి, అయ్యంకి వెంకటరమణయ్య, గుండవరపు హనుమారెడ్డి గుమ్మిడిదల వెంకటసుబ్బారావు, తెల్లాకులబాలయ్య, మల్లెల శ్రీరామమూర్తి, క. రామసుబ్బమ్మగార్లను ఉపసంఘముగా నిర్ణయించిరి.

(౧౦) ద్విభాషా ప్రాంతములందును, దక్షిణాంధ్రులలోను తెలుగువారందరును ఆంధ్రులుగా నమోదుచేయించుకోబలెను. తెలంగాణములో ఆంధ్రజనసంఖ్య జాగ్రత్తగా నమోదుచేయించుకోవలెను. ఇందులకై చేయవలసిన ప్రచారమునకై ఆవసరమైన కరపత్రములు కార్యవర్గమువారు ప్రచురింపవలెను.

## వెండెల్ విల్కీగారి కార్యక్రమము

లండను, ఫిబ్రవరి౧

అమెరికా సెనేటులోని విదేశాంగ వ్యవహారాల కమిటీఅధ్యక్షుడు సెనెటర్ జార్జిగారుకార్డెల్ హల్ గారిద్వారా వెండెల్ విల్కీగారికి వెంటనే ఇంగ్లాండునుండిరమ్మని నాడు. వెంటనే అమెరికాకుతిరిగివచ్చి "అరువు,కౌలు" బిల్లుపైన వాఙ్మూలం ఇవ్వవలసినదని తెలియజేసినాడు.

గ్రేటుబ్రిటనులో పర్యటనంచేసి అనుభవం గడించుకున్నమీదట వెండెల్ విల్కీ ఇచ్చేవాఙ్మూలం చాలాప్రాధాన్యాన్ని కలిగివుంటుందని, బ్రిటనుకుఇచ్చే సహాయం విషయముపై అమెరికాశాసనసభదృష్టిని కేంద్రీకరించడానికి వారువచ్చేవాఙ్మూలం పనికివస్తుందనీ అమెరికాలో తలచినారు.

### వెండెల్ విల్కీ డివెలరాను దర్శించుట

విల్కీ రవతేదిరాత్రి తనప్రయాణసన్నాహాలుచేసుకొని, ౯వతేదిఉదయం విమానంమీద డబ్లినుకు బయలుదేరెను.

ఐర్లాండునుంచి లండన్కుతిరిగిరాగానే, జార్జిరాజును సందర్శించెను. రాజదంపతులతో చాలసేపు సంభాషించెను.

తాను ఐర్లాండులో డివెలరాతో మూడుగంటలసేపు సంభాషించితినని రాయిటర్ విలేఖరితో విల్కీచెప్పెను. అందులో ఒకగంటసేపు తానుఒక్కడే, ఒంటరిగా డివెలరాతో సంభాషించి. తాను కోరిన సమాచారమంతా తెలుసుకున్నాననెను. ఐర్లాండు మంత్రివర్గ సభ్యులను కొందరినికూడా చూచితిననెను.

---

హైదరాబాదురాష్ట్రం ఇత్తేహాదువారు మదరాసు తెలుగుజిల్లాలను ఆరాష్ట్రములో కలుపవలెనని చేయుచున్నప్రచారమునీ సభవారు తీవ్రముగఖండించుచు బ్రిటిషుప్రభుత్వము స్పష్టవాక్యములతో నిరాకరింపవలెనని యీసభవారుకోరుచున్నారు. అట్టిప్రచారమును ప్రతిఘటించుటకు సర్వవిధములాసిద్ధముగాయుండవలెనని యీసభవారు హెచ్చరించుచున్నారు.

కార్యస్థానము బెజవాడలోనుంచుటకు తీర్మానింపబడినది.

రాబోవుమహాసభ తిరుపతిలోగాని ప్రొద్దుటూరిలోగాని జరుపుటకై ప్రయత్నములు జరుగుచున్నవి.

### జర్మనులకు విల్కీ సందేశం

వెండెల్ విల్కీ ఇంగ్లండునుండి స్వదేశానికి ప్రయాణమగుటకు పూర్వం జర్మనుప్రజలకు అందజేయడానికి గాను ఒక ప్రత్యేక సందేశాన్ని ఇచ్చెను ఆసందేశం ఈవిధంగా తెలియజేస్తున్నది:

"నేను స్వచ్ఛమైన జర్మనుకుటుంబంలో పుట్టినవాడను నా కటుంబనామము విల్కీగాదు, 'విల్లిక్' మాతాత, ఆయనభార్య ౧౦౦ఏళ్ళక్రింద జర్మనీనుంచి వచ్చివేసిరి. నిరంకుశత్వము గిట్టనందువల్లను. స్వతంత్రంగాజీవించుటకు హక్కును కోరినవారమటవల్లను వారు జర్మనీని వదలిపెట్టవలసివచ్చినది. మాతాత ఏహక్కునకోరెనో, అదే హక్కును నేను కోరుచున్నాను. నాలో జర్మను రక్తం ఉన్నందుకు నేను గర్వపడుచున్నాను. దురాక్రమణఅన్నా. హింసావిధానమన్నా నేను ద్వేషింతును. నేను ఏఅభిప్రాయాలను కలిగివున్నానో, నాదేశంలో నివసిస్తున్న జర్మనువంశీకులలో అధికసంఖ్యాకులుకూడా ఇదేఅభిప్రాయాలను కలిగివున్నారనిజర్మన్ప్రజలకు తెలియజేయండి. వీరందరికీకూడా స్వాతంత్ర్యంలోనూ, మానవహక్కులలోనూ విశ్వాసమున్నది. జర్మన్-అమెరికన్లమైన మేము ప్రస్తుతం జర్మనుప్రభుత్వం అధికారతృష్ణతో సాగిస్తున్న దురాక్రమణవిధానమును ద్వేషింతుమన్నామని, జర్మనుప్రజలకు తెలియజేయండి."

వెండెల్ ఇంగ్లండులో తనవాయువేగపర్యటనాన్ని పూర్తిచేసుకొని ఫిబ్రవరి౧వతేది అమెరికాకు తిరిగి ప్రయాణమైనాడు, విల్కీ ప్రయాణం చేసిన రైలుకు పోలీసులు చాలాజాగత్తగా కాపలాకాసిరి. రైలుకదలి ప్లాటుఫారము వదలిపోవువరకూ స్కాట్లెండుయార్డు ప్రత్యేకపోలీసులు ప్లాటుఫారంపైననే ఉండిరి. ఎక్సుప్రెస్ కొన్నినిమిషాలకు బయలుదేరుతుందనగా వెండెల్ విల్కీ తనహోటలునుంచి స్టేషనుకు వచ్చివేశాడు. ప్రజలనుఎవరినీ ప్లాటుఫారముపైకి రానివ్వలేదు. ప్రభుత్వోద్యోగులుకూడా ప్లాటుఫారంపైన కనుపించలేదు.

అమెరికాకుప్రయాణమగుటకుపూర్వం విల్కీ బ్రిస్టల్ నగరము చూచెను. బ్రిస్టల్ నగరపు మేయరును కలుసుకొనెను బ్రిస్టల్ నగరవీధులలో కారులో తిరిగి దాడులవల్ల నష్టపడినప్రాంతాలను చూచెను. వెండెల్ విల్కీ బ్రిస్టల్ నుంచిపశ్చిమదిశనవున్న విమానాశ్రయానికి వెళ్లెను. ఆరోజు మధ్యాహ్నము ఇంగ్లండునుంచి లిస్బనుచేరెను

# థాయిలాండు, ఇండోచైనాలు

## సరిహద్దులనుగురించిన వివాదపుచరిత్ర

33 యేండ్ల క్రితం కంబోడియా రావు థాయిలాండుదొరతనానికి సామంతునుగావుండేవాడు అతడు ఫ్రాన్సుదొరతనంవారిరక్షణను అంగీకరించి ఫ్రెంచిదొరతనంవారితో సంధిచేసుకున్నాడు. ఫ్రెంచివారి బలవంతంమీదనే యీరాజాఒడంబడిక చేసుకున్నాడనడానికి తగిన ప్రతినిదర్శనాలు మాకుదొరికాయి. మేకాంగునదికి పడమటితీరంలో ఉత్తరభాగమున చిట్టచివరనున్న లాంగుప్రబాంగులో ౧౮౯౩లో ఫ్రెంచిదొరతనంవారు రాయబారివర్గము నేర్పరచి ఎం. పావేగారిని రాయబారిగానియమించారు. ఆ దేశంమీదికి చీనావారు రెండుసారులుయుద్ధానికివస్తే థాయిలాండుసేనలు చీనాసేనలను పారద్రోలినవి ఒకసారి ఫ్రెంచిరాయబారిప్రాణాలను థాయిసేనలుకాపాడాయి. ఇందుమూలని చీనాసేనలుయుద్ధానికిరాకుండా నిరోధిస్తామనేమిషమీద ఫ్రెంచివారాదేశమును ఆక్రమించుకున్నారు, ఎం.పావేగారిని ఫ్రెంచి దొరతనంవారు తరువాత బాంకాకులో ఫ్రెంచిరాయబారిగానియమించారు. బాంకాకుమీనను నదీతీరమునవున్నది. ౧౮౯౩ లో ఫ్రెంచివారు మేకాంగు నదిమీదుగా స్టీమరులలో ఫ్రెంచిసేనను, మీనననదిమీదుగా యుద్ధనౌకలనుపంపించారు. ఫ్రెంచి యుద్ధనౌకలు ఒకథాయియుద్ధనౌకమీద ఫిరంగులుకాల్చి దానికినష్టంకలిగించాయి. ఫ్రెంచియుద్ధనౌకలుబాంకాకుచేరాయి. మేకాంగునదికి పడమటితీరమునవున్న ప్రదేశమునంతను ౫౦ లక్షల ఫ్రెంచి ఫ్రాంకునాణాలను ౩౦ లక్షలథాయిటికలునాణాలను యియ్యకపోతేయుద్ధానికివస్తామని పావెలుగారప్పుడు థాయిలాండుదొరతనానికి అల్టిమేటంపంపారు. గత్యంతరంలేక థాయిదొరతనంవారీషరతులకు ఒప్పుకుని ఫ్రెంచివారితో ఒడంబడికచేసుకున్నారు, ఆటుతరువాత ఫ్రెంచివారు మేకాంగునదికి కుడితట్టున అనగా థాయిలాండుదేశంవున్నవైపున కొంత ప్రదేశమునూ స్వాధీనపరచుకున్నారు థాయిలాండుసరిహద్దులోవున్న థాయిసేనలను తీసివేయవలెననికూడా నిర్బంధించారు. థాయిలాండువారు విధిలేక వీటికన్నిటికి అంగీకరించి అప్పుడుఒడంబడిక చేసుకున్నారు. ఈరీతిగా థాయిలాండుదేశం వారిసొంతంలోనిభాగాలను ఫ్రెంచివారు అన్యాయంగా వశపరచుకున్నారు.

### ప్రస్తుతవివాదకు కారణం

వెనుక జరిగిన ఒడంబడికలను రద్దుచేయవలెనని ౧౯౩౯ లో థాయిదొరతనమువారు ఫ్రాన్సుదొరతనంవారినికోరారు ౧౯౩౯ ఆగష్టులో అనగా యూరపులో బ్రిటను జర్మనీ దేశాలకు యుద్ధం ప్రారంభంకాబోయే సమయంలో ఫ్రెంచి యిండో-చీనా థాయిలాండు దేశాలకు పరస్పర యుద్ధాలు జరగకుండా ఒడంబడిక చేసుకోవడానికి అంగీకరించవలెనని ఫ్రెంచివారు థాయిలాండువారిని కోరారు. మేకాంగునదిలోలోతైన ప్రాంతమును యీ రెండుదేశాలకు సరిహద్దుగా అంగీకరిస్తే మేము ఒడంబడికకు అంగీకరిస్తామని థాయిలాండువారు చెప్పారు. ఈ రెండు దేశాల సరిహద్దులను స్థిరపరచవలెననికూడా కోరారు. దీనికి ఫ్రెంచివారు అంగీకరిస్తే మేకాంగునదిలో కొన్ని పెద్దదీవులున్ను చిన్న దీవులున్ను థాయిలాండువారికి దక్కుతాయి ఉత్తర దక్షిణాలలో రెండుచిన్నప్రదేశాలున్నూ థాయిలాండు వారికి ఫ్రెంచివారు యివ్వవలసివస్తుంది, అప్పుడు యీరెండు దేశాలకు మధ్య యీనదియే సరిహద్దుగా యేర్పడుతుంది. ఇందుకు ఫ్రెంచివారంగీకరించలేదు. ఒడంబడిక జరగలేదు. అప్పటినుంచి ఫ్రెంచివారు థాయిలాండులో సేనలులేని ప్రాంతంలోకి యుద్ధసామగ్రులను సేనలను పంపుతున్నారు. థాయిలాండుమీదికి విమానాలను పంపుతున్నారు. నాఖంపానంమీద బాంబులు వేశారు.” అని ఒకరు పత్రికకు వ్రాశారు.

(ఆ: గ్రంథపత్రిక)

# దక్షిణాఫ్రికాలో అల్లరులు

౨౫వ తేది ఆదివారంలో వేలకొలది పోలీసులు, పౌరులు, సైనికులు ఆఫ్రికాలోని జోహానిస్ బర్గులో తీవ్రంగా కొట్లాడిరి. ౧౪౦ మంది ఆస్పత్రిలో చేర్చబడిరి. వీరిలో అనేకులు సైనికులు. ఫిబ్రవరి ౧వ తేది ఉదయం సాయుధ మోటారులు ఆ నగరంలో సంచరించుచుండినను నగరంప్రశాంతముగనున్నదనవచ్చును. వందలకొలది ప్రజలు జనరల్ హెర్జాగ్ వార్తా పత్రిక అగు “ఫాదర్లాండ్” కార్యాలయంవద్దను రిపబ్లికన్ పార్టీ కార్యక్రమానికి అనుకూలతచూపించే జాతీయవార్తాపత్రిక అగు “ట్రాన్సువాలర్” కార్యాలయంవద్దను కూడిరి. రెండుఆఫీసులకూ దెబ్బలుతిన్నవి.

౩౧వ తేది రాత్రి అల్లరిప్రారంభమయ్యెను ఇంతవరకు ఫ్రీస్టేట్ పరిపాలకుడున్నూ, ఇప్పుడు అస్సివాబ్రాండ్వాగ్ నాయకుడునూ అగు డాక్టర్ ఫాండర్స్బర్గు ఒకసమావేశంలో ఉపన్యసించెను. (ఈసంస్థ రిపబ్లికన్ తీవ్రవాదులకుచెందినది) ఈసమావేశం రాజకీయాలకు సంబంధించినదికాదు. అదిశాంతంగానే జరిగెను. సమావేశానంతరం వీధులలో సంఘర్షణలుజరిగినవి. సైనికులు, పౌరులు కొట్లాడుకొనిరి. పౌరులలో కొందరు తమసంస్థలకు ఇష్టమైనట్లుగా గడ్డాలు పెంచినారు. ఇంతలో పోలీసులు అడ్డుపడగా భుజాలకు నారింజపట్టీలులేని ఈపోలీసు భటులకు ఉత్తరువులు సైనికులకునష్టంకలిగించినవి. (ఈపట్టీలు వేసుకున్నవారు ఆఫ్రికాలో ఎక్కడైనా పనిచేయుటకు ఒప్పుకున్నారనిఅర్థము. పోలీసులు, సైనికులుకూడా వీటినిధరించవచ్చును).

అల్లరులు తిరిగిఆదివారం ఉదయమువరకు సాగినవి పోలీసులప్పుడు కన్నీరురప్పించువాయువుఉపయోగించి కొన్నిమార్లు సోటాకర్రలు ప్రయోగించిగుంపులను చెదరగొట్టిరి. మోటారుకారులు పాడైనవి. ఒకపోలీసులారీ తగులబడినది. పరిసర పట్టణాలనుండి అదనపు పోలీసు దళాలుపంపబడినవి. మిలిటరీ శిబిరాలనుండి తీసుకరాబడినసేనలు మిలిటరీ పోలీసులకు సాయపడినవి.

శనివారంనాడు సాధారణంగా జోహానిస్ బర్గులో సెలవుమీదవున్న సైనికులు తిరుగుచుంటారు. వీరిలోకొందరు ఒకట్రాములో పోవుచున్న గడ్డపుమనిషినిచూచి ఎకరొక్కన్నప్పుడు అల్లరిప్రారంభమయింది. చాలాషాపుకిటికీలు విరిగిపోయినవి. సైనికులు అస్సివా బ్రాండ్వాగ్ ఆఫీసుకు వెళ్ళబోయిరి. ఇదిబ్రిటిషు సంస్థ. ఇది “ట్రాన్సువాలర్” భవనంలోఉన్నది. సైనికులుఇచ్చటికిచేరలేకపోయిరి. అంతటవారు భవనంవెనుకకు పరుగెత్తుకొనివెళ్ళి కిటికీఅద్దాలను, అచ్చుయంత్రాలను విరగగొట్టిరి.

ప్రభుత్వాధికారము పడగొట్టుటకు ప్రయత్నించుసంఘాలను సైనికకవాతులవంటి చర్యలను అణచివేయుటకు నిబంధనలు ఫిబ్రవరి ౧వతేది ప్రకటించబడినవి. ఈనిబంధనలు తక్షణమే అమలులోనికి తేబడినవి. హానికరమైనట్టి ప్రకటనలను,శత్రుజాతులకు చెందిన విదేశీయులవద్ద రేడియోపరికరాలను,శత్రువుల బ్రాడుకాస్టుప్రకటనలను బహిరంగంగా వినుటను ఈనిబంధనలు నిషేధించినవి హానికరమైనట్లు ప్రకటనలు చేసినవారికీ, యూనిఫారంధరించిన సోల్జర్లపై తిరుగబడినవారికి డైనామైట్లు తయారుచేసినవారికీ, దారుణశిక్షలువిధించబడునని ప్రకటించబడెను.

## రుమేనియాలో శాంతి

ఆగ్నేయ యూరపులో శాంతిభద్రతలువుండడం ఈనాడు ఇటురుమేనియాకూ, అటుజర్మనీకి కూడా అవసరమని రుమేనియా నియంత జనరల్ అంటొనెస్కూ జర్మనీలో నాజీపాలనస్థాపన వార్షికోత్సవసందర్భంలో రుమేనియా పత్రికలలో ఒకవ్యాసంలో వ్రాసెను.

అనుమతిలేనిదే ఎవరైన ఆయుధసామగ్రిని తీసుకొనిపోతున్నట్లుకనబడితే వారికిఎట్టివిచారణ లేకుండా ఉరిశిక్షవిధించబడుతుందని జనరల్ అంటొనెస్కూ ఉత్తర్వులుజారీచేసెను. ప్రభుత్వంపైన తిరుగుబాటుసాగించుటకు క్రొత్తప్రయత్నాలు జరిగినట్లయితే అతితీవ్రమైనచర్యలు జరపవలసినదని, అనుమతిలేకుండా జరిగేసమావేశాలపై (అసభలలోనిసభ్యులు వెంటనే సమాధానం ఇవ్వకపోతే) కాల్పులుసాగించవలసిందనికూడా అంటొనెస్కూ ఉత్తర్వుచేసెను.

జర్మనీలో నాజీపద్ధతిపైన పనిచేస్తున్నట్టి క్రొత్తరకపు కార్మికసంస్థలూ, ఇతరసంస్థలూ రుమేనియాలోకూడా స్థాపించబడబోవుచున్నవట.

ఐరన్‌గార్డు యువకసమితిని రద్దుచేసివేసిరి. రుమేనియా యువతీయువకులను హిట్లరు యువజనాన్ని ఏర్పాటుచేసినట్లుచేస్తారు. జర్మను కార్మిక సంఘాలవలె రుమేనియాకార్మికులనుకూడా ఏర్పాటుచేస్తున్నారు.

బుఖారెస్టు యూనివర్సిటీ భవనమందు ఎవరో ఒకస్త్రీముగ్గురురుమేనియన్ ఆఫీసర్లను తుపాకితో పేల్చినట్లూ ఆముగ్గురిలో ఒక లెఫ్టినెంటు కర్నల్ వున్నట్లూ ఒక వార్త తెలుస్తున్నది.

జనవరి ౨౧వ తారీఖున బుఖారెస్టు సమీపంలోని జలావా అరణ్యంలో ౯౨ మందిప్రజలను చంపివేసిన ఐరన్‌గార్డు విప్లవకారులగుంపును అరెస్టుచేసిరి. ఇపుడుదేశంఅంతా ప్రశాంతిగా ఉన్నది. అధికారులింకా కొందరిసారి అల్లరులకుకారకులైనవారిని వెదకుచున్నారు. విప్లవకారులు దొంగిలించిన పరికరాలు పదార్థాలు చాలాపట్టుబడినవి.

## ఇరాక్‌లో క్రొత్తమంత్రి వర్గం

జనవరి రెండవపక్షంలో ఇరాకుమంత్రివర్గసభ్యులు ఒక్కొక్కరే రాజీనామాలిచ్చుటవల్ల ఫిబ్రవరి ౧ వతేదిఒకక్రొత్తమంత్రివర్గం ఏర్పాటు చేయబడెను. జనరల్ టాహా హాషీమీప్రధానమంత్రిఅయ్యెను. విదేశవ్యవహారాలు, రక్షణశాఖలనుకూడావారేచేపట్టిరి.

అలీముమ్తాజుగారు ఆర్థికమంత్రి, రాకపోకలశాఖ తాత్కాలికమంత్రి, ఓమార్ నాదోమీగారు స్వదేశశాఖామంత్రి, న్యాయశాఖ తాత్కాలికమంత్రి సిద్దీకుబస్సాముగారు విద్యాశాఖమంత్రి, హమ్‌దీపచాచీగారు సాంఘికవ్యవహారాలమంత్రి.

## అబిస్సీనియా చక్రవర్తికి బ్రిటిషుసహాయం

### బ్రిటనుకు రాజ్యాక్రమణవాంఛలేదు

### పార్లమెంటులో ఈడెన్ ప్రకటన

అబిసీనియాలో హేయిలీసెలాసీ తనసింహాసనాన్ని ఆక్రమించుటకు బ్రిటనుసహాయంచేయుటలో వుద్దేశ్యమును బ్రిటిష్‌విదేశాంగమంత్రి అంథనీఈడెన్ పార్లమెంటు కామన్సుసభలో ఫిబ్రవరి ౪ వతేదివ్యక్తపరచెను.

స్వతంత్ర అబిసీనియారాజ్యం మరలఏర్పడవలెననే బ్రిటిషుప్రభుత్వముకోరుచున్నదనీ సింహాసనాన్నతిష్ఠించుటకు హెయిలీసెలాసీచక్రవర్తి హక్కులను బ్రిటిష్‌ప్రభుత్వంఒప్పుకొన్నదనీఅతనుఅనెను. చక్రవర్తి తనకుబయటనుండిసహాయంగాలాఅవసరమని బ్రిటిషుప్రభుత్వానికి తెలియపరచెనట. ఈఅభిప్రాయంతో బ్రిటిషుప్రభుత్వం ఏకీభవించుచున్నదని ఈడనుచెప్పెను ఆర్థిక రాజకీయ సంబంధమెట్టి ఏసహాయంఅయినను యుద్ధముగిసినతరువాత అంతర్జాతీయఏర్పాటునుబట్టి వుండవలెను. బ్రిటిషువారికి అబిసీనియాలో రాజ్యాక్రమణవాంఛలేదని ఈడనుచెప్పెను. ఈలోపునఅబిస్సీనియాలో కొంతభాగంలో సైనికచర్యలు నడపుటకు తాత్కాలికంగా బయటినుండి సహాయంఅవసరమగును సైనికచర్యలు చక్రవర్తిసలహాపైనడచును. వాటిని నిలుపుచేయుటకు వీలయినపరిస్థితిఏర్పడగానే నిలుపుచేయబడును.

## ఫ్రాన్సుఅమెరికాసహాయ మపేక్షించుట

ఫిబ్రవరి ౯ వతేదిన పెకెయిను హాప్‌వార్డు కెర్షనరుతో చాలాసేపుసంభాషణజరిపెను. కెర్షనర్ అమెరికన్ ఫ్రెండ్సు సర్వీసు యూరోపియనుడైరెక్టరు ఈసర్వీసుఒకసహాయకసంస్థ "క్వేకర్సు"అనబడుధార్మికుల ప్రోత్సాహసహకారాలవలన నిర్వహింపబడుచున్నది.

కెర్షనర్‌గారు ఫ్రెంచిస్త్రీలకూ, బిడ్డలకూ శరణాగతులకూ అమెరికన్ ఫ్రెండ్సు సర్వీసువారుచేస్తున్న సహాయకార్యాలనువర్ణించిరి. పెకెయిను ఫ్రాంసుకు అమెరికాదేశపుసహాయము అత్యంతావశ్యకమైనదని నొక్కిచెప్పిరి.

## బ్రిటనుకు అమెరికా సహాయంచేయవలెను

### సమ్నర్ వెల్సుగారిసమర్థన

న్యూయార్కు యూనివర్సిటి లాస్కూలులో ఉపన్యసిస్తూ అమెరికాసహాయ విదేశాంగమంత్రి సమ్నర్ వెల్సు గారు అక్షరాజ్యాలకు విజయంలభించినయెడల దక్షిణఅమెరికాలో ఆర్థికంగాను, రాజకీయంగాను దాడులుజరుగునని చెప్పిరి. అమెరికా ఆత్మరక్షణకుగాను బ్రిటను గ్రీసు,చైనాలకు పరిపూర్ణసహాయంచేయవలెననిరి.

## బ్రిటనుకు రూజ్వెల్టు అభయం

అంతకంతకుహెచ్చుగా గ్రేటుబ్రిటనుకు సహాయపడుటకు అమెరికానిశ్చయంగా సంకల్పించుకొనివున్నది. అని రూజువెల్టుగారు క్రొత్తబ్రిటిషురాయబారి లార్డుహాలిఫాక్సుగారు అన్నాపోలీసులోవుండగాఒకసందేశాన్నిఅందజేసెననిఇప్పుడుఅమెరికాప్రభుత్వపుస్టేటుడిపార్టుమెంటువారు ప్రకటించినారు.

## తుర్కీకి రూజ్‌వెల్ట్ ప్రతినిధిరాక

రూజువెల్టుగారి ప్రత్యేకప్రతినిధి కర్నల్ డోనోవాన్ సెలోనికానుండి జనవరి ౩౧న తేదిని తుర్కీకి పోయెను. ఇతను రూజ్‌వెల్టువద్దనుండి తుర్కీఅధ్యక్షునికి ఒకసందేశం తెచ్చెను. కర్నల్ డోనోవాన్ ౪వ తేగిన తుర్కీప్రధానమంత్రిని, సైన్యశాఖాధ్యక్షుని దర్శించెను రాత్రి బయలుదేరి పాలస్తీనా, ఈజిప్టులకు వెళ్లెను.

బాల్కన్ రాజ్యాలు జర్మన్, ఇటలీల ఒత్తిని ప్రతిఘటించుటకు కర్నల్ డోనోవాన్ చర్యలు ప్రోత్సాహం ఇస్తున్నయని తుర్కీలోని జర్మన్ రాజకీయవర్గాలవారు కోపం చూపుతున్నారు అమెరికా తనకు సంబంధించని విషయాలలో జోక్యం కలుగజేసుకుంటున్నదని వీరంటున్నారు. బాల్కన్‌లమీద ఏదోక్రొత్తచర్యను ఆలోచిస్తూంటేకపోతే జర్మన్లు ఇంతభయపడవలసిన అవసరం ఉండదు, జర్మనీతో తుర్కీయుద్ధంలో చిక్కుకున్నదలయ తుర్కీకి అమెరికానుండి వస్తుసహాయం వస్తుందని కర్నల్ డోనోవాన్ అన్నారుట.

### బ్రిటనుకు రూజ్వెల్టు దూత

జనవరి ౨౯వ తేది రూజ్‌వెల్టుగారి ప్రత్యేకదూత హారీహాకిన్సుగారు చర్చిల్ దంపతులతో కలిసి సౌతాంప్టన్‌ను దర్శించిరి. హారీహాప్కిన్సు నార్వేరాజును హాకన్‌గారినికూడ దర్శించెను.

## సావర్కరుగారికి వైస్రాయి లేఖ

### మధుర తీర్మానానికి జవాబు?

మదరాసు రాజధానిలో మధురలో జరిగిన అఖిలభారత హిందూ మహాసభలో చేయబడిన తీర్మానాలను హిందూ మహాసభాధ్యక్షుడు వి. డి. సావర్కరుగారు వైస్రాయిగారికి పంపుచుయిదివరకు లేఖ వ్రాసినారు ఆ లేఖలోని విషయాల కన్నిటికి వివరముగా జవాబు వ్రాయుచు వైస్రాయి వ్రాసిన లేఖ సావర్కరుగారికి చేరింది," అని మహారాటా పత్రిక ప్రకటించింది

